# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర మార్గశిర బ॥ ౫

సోమవారము


## ఆంధ్ర విద్యాపీఠోత్సవము

ఆంధ్రవిద్యాపీఠమువారు ఈసంవత్సరము తమవిద్యార్థులకిచ్చు పట్టాలసందర్భములో వారికి స్వాగతోపన్యాసమును ఇచ్చుటకు మనహైదరాబాదు విద్యామంత్రిగారగు నవాబ్ మెహిదీయార్ జంగు బహద్దరు గారిని ఆహ్వానించిరి. మొన్నటి శనివారమునాడా యుత్సవము జరిగెను. నవాబుగారి యుపదేశోపన్యాసము పేరుచో ప్రకటితమైయున్నది. గత సంవత్సరము మనకు మహామాత్యులుగా నుండియుండిన సర్ అక్బరుహైదరీగారిని ఇకేపనికి ఆహ్వానించియుండిరని వినియుంటిమి. కాని ఏకారణముచేతనో అప్పుడా కార్యము జరుగకపోయెను ఇప్పుడు మరల మనరాష్ట్రమందలి యొక గొప్పమంత్రిచేత ఈకార్యము నెరవేరినందులకు సంతసింపవలసి యున్నది. ఉపదేశ మిచ్చిన వారు మనవిద్యామంత్రులు. ఉపదేశమందినవారు మన ఆంధ్రసోదరులు. అందుచేత ఈఉపదేశము మనకుచాలా ముఖ్యమైనదై యున్నది

నవాబుగారు కొన్ని యేండ్లక్రిందట హైదరాబాదు ప్రభుత్వమువారు ఆంధ్ర విద్యాపీఠానికి దానము చేసిన ఒకలక్ష రూపాయాలముచ్చటను ప్రారంభమందే తెలిపినారు. ఆ మొత్తము మనఆంధ్రసోదరులకు లాభకారియేమైనను ఇదిమాకు మారాష్ట్రమునకు నష్టకారి. మొత్తము హిందూదేశములోమనకు ఇట్టిద్రవ్యసహాయముచేసేవారుకానరారు మన ద్రవ్యము మాత్రము హిందూస్థానమందలి అన్ని మూలాలలోని సంస్థలకు సక్రమముగా పంపబడుచున్నది మా రాష్ట్రములో విద్యావ్యాప్తి నూటికి ౬ లేక ఇంకా విశేషమైతే 2 అని వినుచున్నాము ఈకారణంచేత మావిద్యకై ఇప్పుడువ్యయమగు ద్రవ్యమంతకు రెండంతల ద్రవ్యమైనను కావలసియుండును మైసూరు సంస్థానములో విద్యపై మొత్తముఆదాయంలో ఆరవభాగము వ్యయముచేయుచున్నారు మనరాష్ట్రములో ఎనిమిదవ భాగము కన్న తక్కువనే వ్యయము చేయుచున్నారు. ఆంధ్ర మరియు ఉస్మానియా విద్యాపీఠాలలో సన్నిహిత సహకార సూచకముగా డాక్టర్ గంగూలీఅను బెంగాలీవారు వ్రాసిన ఆంధ్ర శిల్పములను ఇంగ్లీషుగ్రంథాన్ని హైదరాబాదులో అచ్చుకొట్టనున్నారని నవాబుగారు తెలిపినారు- ఆంధ్రులువ్రాసిన ఆంధ్రగ్రంథాలను విరివిగా మన హైదరాబాదు ప్రభుత్వమువారు అచ్చుకొట్టించితే ఇంకా బాగుంటుంది

నవాబుగారు తెలంగానాలో ప్రాచీన చారిత్రిక సారస్వతవైభవమును కాకతీయ గోలకొండ సామ్రాజ్యములందు ఆంధ్రులకు వారిభాషకు వారికళలకుకలిగిన ఆదరణమును బాగా వ్యక్తపరిచినారు. కాకతీయసామ్రాజ్యము ఆంధ్రులకు సేవచేయుటలో విశేషములేదు-గోలకొండ పాదుషాలు ఆంధ్రుల నాదరించుటలో వారిఘనత వారినరసత, వారి భావవైశాల్యము వ్యక్తమగుచున్నది నవాబుగారు వరంగల్‌లోని ప్రాచీన సాంఘికజీవనమునుబాగా కొన్నివాక్యాలలో నిరూపించినారు. ఈవిషయాలు ఒక్కక్రీడాభిరామములోనే కలవు నవాబుగారికి తెనుగురాదు అయినను వారీ విషయాలను ఎట్లో సేకరించినందులకు వారి విషయగ్రహణశక్తి స్పష్టమగుచున్నది

"మల్కిభరాముడు"ను అబ్రాహీమునూ ఆంధ్రవాఙ్మయమును పోషించినముచ్చట చెప్పినారు. ఇంకను ఒకరిద్దరు ముసల్మానులు గోలకొండ సామ్రాజ్యకాలములో ఆంధ్ర కవులను పోషించియుండిరి అంతటితో ఆప్రకరణముముగిసెను మల్కిభరామునితో అది చెల్లయ్యెను. మరల యీ౩౦౦ఏండ్ల కాలములో ఈరాష్ట్రములో తెలుగును విచారించిన నాథుడు లేకపోయెను. తెలుగు తెగులైపోయెను నవాబుగారు ఏలనో అక్కన్న పేరును యంకన్న అని పేర్కొనినారు పేరేదైతేనేమి కాని అక్కన మాదన్నలతో అనగా ఆ మల్కిభరామునితో ఆంధ్రుల మంత్రిత్వము పెద్ద ఉద్యోగాలు చెల్లు అయిపోయెను. ఈ ౩౦౦ఏండ్లనుండి అనగా అక్కన్న మాదన్నలు ఖుతుబుషాహీల సేవలో తమ తలలను సమర్పించుకొన్న తర్వాత నేటివరకు ఈరాష్ట్రములో ఒక ఆంధ్ర సుబేదారుకాని, ఒక ఆంధ్ర మంత్రికాని, ఒక ఆంధ్రమహామంత్రికాని నియమింపబడలేదు కుతుబుషాహీ సుల్తానుల కాలములో తెనుగువారికి వారిభాషకు ఏస్థానముండెనో మన నవాబుగారు చక్కగా వ్యక్తీకరించినారు.

"ఖుతుబుషాహీ పైసా అతో హిందూ ముసల్మానులంభయులును తమ సుల్తానుపై భక్తి విశ్వాసములను కలిగియుండుటలో పోటీపడుచుండిరి రాజ్యములో గొప్పఉద్యోగాలలో ఆంధ్రులనియుక్తులైయుండిరి "యంకన్న" మాదన్నమంత్రులు సర్వతంత్ర స్వతంత్రులైయుండిరి ఖుతుబ్‌షాహీ ప్రభువుల కాలములో తెనుగు ప్రతిగ్రంథాలకు గొప్పప్రోత్సాహమిచ్చిరి రాష్ట్రములో ఫార్సీ తర్వాత రెండవస్థానము తెనుగుకే ఉండింది 'ఖుతుబ్‌షాహీ సుల్తానులు గొప్ప మతసహనమును చూపినవారు మాధ్వబ్రాహ్మణ మఠాధిపతులనువారు ప్రత్యేకముగా గౌరవించి పోషించిరి ”

పై వాక్యములలో ఎంతటిగొప్ప అంతరార్థమిమిడియున్నదో,ఎంతటిగొప్ప ఆదర్శమున్నదో, పాఠకులు బాగా ఊహించుకొనగలరు

నవాబుగారు ఉస్మానియా విద్యాపీఠములో ఉర్దూద్వారా విద్య చెప్పించుచున్న విషయాన్ని బాగా నిరూపించుచు రెండుసంగతులను వెల్లడించి యున్నారు ఆంధ్ర విద్యా పీఠమువారు ఒకనాడు తెలుగులోనే విద్య అంతయు చెప్పించితే నా కాశ్చర్యము లేదని చెప్పినారు ఇప్పుడుమాత్రము ఆంధ్ర విద్యాపీఠము నేటివీరకాయుఅనియు, అందు తెనుగుకు ఉస్మానియాలో ఉర్దూకుండుదానిలో శతాంశమైనను స్థానము లేదనియు అందరును ఆశ్చర్యపడుచున్నారు దానికేమి ఆదర్శమున్నదో దాని విశిష్టతయేమో బోధపడలేదు- రెండవది యేమనగా ఉస్మానియాలో ముల్కీ భాషలను ఎం ఏ. వరకు చదివించ ఏర్పాటుచేసినామని నవాబుగారన్నారు. దానివలన ఆంధ్రులకేమి లాభము? తెనుగు ఎం.ఏకు ఎందరైనను కూడులభించునా? తెనుగు ఎం.ఏ.లో ఎంతమందిచదువుచురు?ఏటేట ఇద్దరు ముగ్గురికంటెఎక్కువచదువరు!మరి యితరతరగతులలో తెనుగున కేమి స్థానమున్నది? తెనుగును తెలంగానాలో హైస్కూళ్లలోను కళాశాలలోను నిర్బంధ ద్వితీయభాషగా చెప్పించవలెను- ఆ విధముగాచేసితే తెనుగునకుగూడా కొంత స్థానముండని సంతృప్తి పడవచ్చును.

ఈమధ్యన దేశములో కళాశాలలలో చదువు విద్యార్థులలో అల్లరి ఎక్కువైనదని నవాబుగారు వాపోయినారు అది సత్యమే. ఏ విద్యాపీఠములో చూచినను విద్యార్థులు సమ్మెలుకట్టుట, అల్లరిచేయుట పరిపాటియై పోయినది బొంబాయి అల్లరులు, మన ఉస్మానియా విద్యాపీఠ విద్యార్థులఅల్లరులు అందరికిని తెలిసినవే కదా! మన విద్యార్థుల అల్లరులను విచారించుటకొక కమిషను కూడా ఏర్పడియుండెను దానిగతి యేమయ్యెనోయేమో! విద్యాపీఠముల నడుపువారందరును దీర్ఘముగాఆలోచింపదగిన విషయమిది కొన్ని విద్యాపీఠాలలో మత బోధ నీతిబోధకూడా నేర్పినను విద్యార్థులలో పెక్కుమంది తద్విరుద్ధ గా నడుచుకొనుచున్నారు పూర్వకాలములో గురువంటే తల్లిదండ్రులకన్న ఎక్కువ గౌరవనీయుడుగా ఉండెను ఇప్పుడు కూలికి బోధించే గురువులపై నౌకరీలకై చదివేవిద్యార్థులకు గౌరములేకుండుట కానవచ్చుచున్నది. విద్యోద్దేశములోని మూలసూత్రమునకే భంగము కలిగినది. మన విద్యాపీఠాలు నౌకర్లను సిద్ధము చేసే యంత్రాలయాలై పోయినవి ఈ విషయములో ముఖ్య సంస్కారము మొదలు కావలెను అది కావంతవరకు కళాశాలలపై ద్రవ్యము పూర్తిగా వ్యర్థమగుచుండును.

---

## రష్యానుగూర్చి నెహ్రూగారి అభిప్రాయము

---

ఆర్-యస్-పండితు గారు డిసంబరు ౨ వతేదిన పత్రికాప్రతినిధులతో ముచ్చటించుచు రష్యా ప్రజలు ధైర్యముతో శత్రువును ప్రతిఘటించుచున్నందుకు పండితజవహర్లాలు నెహ్రూ గారు పూర్తిగాప్రశంసచేయుచున్నారని ఆర్-యస్-పండితుగారునైని సెంట్రల్ జెయిలులో కొద్దిరోజులక్రిందట ఒక్కసంవత్సరకాలము డేరాడూన్ జెయిలులో పండితనెహ్రూగారితో నేయుండిమునిరి యుద్ధములో చిన్నచిన్న ఘట్టములమాటనుకేకేటించి, ఒకదేశప్రజయంతయు స్వాతంత్ర్యము కొరకై వీరత్యాగముచేయగలదని చైనాప్రజలును రష్యాప్రజలును చూపగలరని చెప్పిరి- యుద్ధములో రష్యాచేసినటువల్ల సైనికదృష్టితోగాని, సైనికభావములదృష్టితోగాని చాలాభేదమేర్పడినదని జవహర్లాలుగారిఅభిప్రాయమనిఆర్-యస్-పండిట్ గారుచెప్పిరి భారతదేశప్రజలకిది గుర్తెరిగియు వరలసానుభూతి! సహజముగా రష్యావైపున నుండుననియు జవహర్లాలు గారిఅభిప్రాయము

కానియింతమాత్రమున బ్రిటనుకెదు భారతదేశ ప్రజ కాంక్షించిన మార్పులు భారతదేశముయొక్క బ్రిటనువైఖరిని బట్టి యుండునని నెహ్రూ గారిఅభిప్రాయము

కాంగ్రెసు శాసనసభాకార్యక్రమము విషయములో అట్టికార్యక్రమము ఉండవలసినదే నిధనే, కాంగ్రెసు మూడుసభల ఒకటి ఏర్పడితర్వాత శాసనసభా కార్యక్రమమునుగూర్చి ఆలోచించవచ్చునని జవహర్లాలుగారు చెప్పుచుండిరట

---

## జిన్నా గారితో కాంగ్రెసు సమాధాన యత్నము

కాంగ్రెసు ప్రధానకార్యదర్శియగు ఆచార్యకృపలానిగారిని " అసోసియేటెడ్ ప్రెస్సు" ప్రతినిధిజిన్నా గారితో సమాధానముకుదుర్చుకొనుటకైమరలకాంగ్రెసువారు ఏదైనయత్నముచేసి నారాఅనిఅడుగగా కృపలానిగారు "కాంగ్రెసుమహాసభవారుచేయుటకు ఎదురుచూచుచున్నది-జిన్నాగారేముందుగా కాంగ్రెసుతో రాజీబేరముచేయుదలచుచో, వారికి ఎట్టిఆటంకములు ఉండబోవు- గాంధిమహాత్ముడు ప్రతిష్టకొరకు లాడువారుకారు- వారు జిన్నా గారియింటికిపోయి వారితో మాట్లాడుటకు సంసిద్ధులు" అనిచెప్పిరి ఇంతవరలో జిన్నా గారుకోరిన షరతులను ఒప్పుకొన్నచో కాంగ్రెసుయొక్క జాతీయతకు భంగము కలుగునుగనుకను, దానిపూర్వచరిత్రకు విరుద్ధముగనుండునుగనుకను జిన్నా గారితో సమాధానము కుదుర్చుకొనుటకై కాంగ్రెసుచేసినప్రయత్నములన్నియు విఫలములయ్యెను జిన్నా గారుఅనవరతమునుమార్పుతో భారతదేశములో రెండుజాతులున్నవని క్రొత్తమాటలేదని దానిని ఒప్పుకొనవలెనని పట్టుబట్టియున్నారు-కాబట్టి కాంగ్రెసుమంచిసమయముకొరకై వేచియున్నది జిన్నాగారు స్వయముగా సమాధానప్రయత్నము చేయదలచినచో వారుగాంధిగారికి వ్రాసినచాలును-అని కృపలాని గారుచెప్పిరి

బ్రిటిషుప్రభుత్వము రాజీయుద్దేశముతో బదులిచ్చు మినిస్టరీగా పనములో చెప్పబడినట్టి అధినివేశ ప్రతిపత్తిని యుద్ధానంతరము ఇంతకాలముఆని కోరినంతకాలములోగా ఇచ్చుటకొనుటకుఒప్పుకొన్నచో, కాంగ్రెసువర్ధాలో చేసిన నిర్ణయమును సవరణ ఒప్పుకొనువారని కృపలానిగారిని ప్రశ్నించగా, వారుసందేహించుచునే జవాబిచ్చుచు అసలు విషయముకాదనియు, సేయు, వారేమిచేసినారను నది అసలువిషయమనియు చెప్పిరి

---

## సూర్యనారాయణ శాస్త్రిగారి షష్టిపూర్తి సమ్మానము

---

విశాఖపట్టణము, డిసెంబరు ౧

అభినవవాగనుశాసన బిరుదాంకితులగు శ్రీ బులుసు సూర్యనారాయణశాస్త్రిగారి షష్టిపూర్తి సమ్మానోత్సవము నిన్న సాయంకాలము జయపురాధీశ్వరుల అధ్యక్షతను విశాఖపట్టణమునందు వాలుకేరు ౬ లో వైభవముగా జరిగెను

ప్రారంభమున సమ్మానసంఘాధ్యక్షులు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు ప్రసంగించుచు శ్రీశాస్త్రిగారు పూర్వకావ్యగ్రంథములు పరిశుద్ధముగా పఠించినవారనియు, పద్యగ్రంథములు లేకముద్రితవారనియు, సంస్కృతవాఙ్మయపరిశ్రమ విమర్శపూర్వకంగా వ్రాసెరనియు తెలిపిరి,

తరువాత సమ్మానసంఘ కార్యదర్శి శ్రీదివాకర్ల వెంకటావధానిగారు షష్టిపూర్తిసంచికను శ్రీశాస్త్రిగారికిసమర్పించిరి-

అనంతరము సభాధ్యక్షులు శ్రీవిక్రమదేవవర్మమహారాజావారుపన్యసించుచు పూర్ణాయుర్దాయము ౧.౨౦ సంవత్సరములలోను పూర్వార్ధముగడచి, ఉత్తరార్ధముప్రవేశించిన నన శ్రీశాస్త్రిగారు పెద్దలఆశీర్వచనమునొంది చిరకాలముజీవింతురని ఇట్టిఉత్సవములు జరుపబడుననియు, గొప్పవారిని గౌరవించుటవారిగొప్పతనముఅనకాదనియు, మనయొక్క ఔదార్యము తెలియజేయుటకేయనియు తెలిపిరి-

సమ్మానసంఘమువారి పక్షమున శ్రీఅధ్యక్షులవారు శ్రీసూర్యనారాయణశాస్త్రిగారికి ౧౧౧౬ రూప్యములను కానుకనుసమర్పించిరి-

పిమ్మట పెక్కుసంస్థలు స్వాగతపత్రములు సమర్పించినవి పెక్కుమందిప్రముఖులు శ్రీశాస్త్రిగారిని ప్రశంసించుచుఉపన్యసించిరి-

శ్రీశాస్త్రిగారుతమకుసత్కారముగావించినందుకు కృతజ్ఞతను తెలుపుచు వేదమునందలి అధ్యయనాగరికతనుగూర్చి ఉపన్యసించిరి-

(ఆంధ్రపత్రిక)

---

## బ్రిటనులో క్రొత్త ఇండియా హైకమిషనరు

---

బెంగాల్ ఆసెంబ్లీస్పీకరగు సర్ మహమ్మదు అజీజుల్ హక్కుగారుస్పర్ ఫిరోజు ఖాను నూను గారిస్థానములో బ్రిటనులో ఇండియాయొక్క హైకమిషనరుగానుండుటకు నియుక్తులైనారు కొంతకాలమునుండి సైమాయి గారి కార్యవర్గములో సభ్యులుగా సంనియుక్తులైరని తెలిసినదే

---

## స్థానికవార్తలు

శ్రద్ధివారిధికస్సై యాత్రించినవారి వివరము లిచ్చినారు-శ్రీ కృష్ణస్వామిగారిభార్య ౧౦౦రూ వెంకటరంగరెడ్డిగారు ౫౦ పాపాగోపాల్దాసు మహంతుగారు ౫౦ రు॥ గాజీయార్జంగుబహద్దరు ౧౦౦_నమూలాల్ రాములాల్ కమిటి ౨౫౧ శాంప్రసాదుపటేలుగారు ౧౨౦ డాక్టరు వహీదుల్లా గారు ౨౫ రూపాయిలు

హైదరాబాదు ప్రముఖులు కొందరు విద్యగా ప్రదర్శనప్రదర్శనలను తగ్గించుటకై ప్రతిజ్ఞాపత్రకటనమునుచేసినారు ప్రభుత్వమువారు శాసనము చేసినారనియు, అందుచే పురప్రముఖులు దానికి తోడ్పడవలెననియు అందుచే గౌ॥సయ్యదుఅబ్దుల్‌జమంత్రిగారు చెప్పినసభలో వివిధవ్యక్తులవారందరును పాల్గొనిరనియు ... ప్రాద్దున ... బహిరంగసభజరుగునని యు సత్సాలగుగారు అధ్యక్షతవహింతురనియు తెలిపినారు-

అన్వలుకాలాకార్లమార్పులు యాత్రించిదిగు జరిగినవి ఏక్ సాధుప్రసాదు గారు రెవెన్యూ కచ్చేరిలో స్పెషల్ ఆఫీసరు గాను,అహమదీ హుస్సేనుగారు మహబూబునగరు తాలూకాదారుగాను, రామబక్క గారు కొత్తగూడెం, గులాం హైదరుగారు రాయచూరు తాలూకాదారుగాను అహమదలీ గారు లోకల్ ఫండు కార్యదర్శిగాను గులాంమొహియుద్దీన్ గారు బీదరు తాలూకాదారుగాను, కరీముల్లాఖాదిరీ గారు బీదరు తాలూకాదారుగాను, ఫక్రుద్దీన్ మహమూదుగారు నల్లగొండ తాలూకాదారుగాను ఏర్పాటు చేయబడినారు-

పింఛనెల్ జమీందారుఅగు రాజాఅక్బరలీ ఖాన్ ఆతేవారు హైదరాబాదుకువచ్చినారువారు వివిధస్థలాలను చూచి ఆనందించిరి ... జనాబ్‌ సాదుసాయంత్రము ... నిజాం ప్రభువుగారికి తోకలకి ఒకగంటసేపుమాట్లాడిరి-తర్వాత శ్రీ యువరాజాగారితో కలిసిరి

"ప్రతాప్"అనుపత్రికయొక్క సంపాదకులగు కృష్ణాజీగారు లాహోరునుండి హైదరాబాదుకు డిసెంబరు౪ తేదిలో రానున్నారు-

నాగపూరులో కాంగ్రెసునాయకులగు భారతీఅనువారు హైదరాబాదుకువచ్చిఇచ్చటికాంగ్రెసు సభ్యులతో కలిసి మాట్లాడిరి

అంవరంబరునాడు ఔరంగాబాదుకుచేరారు గారిఅగుఅలీఅక్బర్ బిల్గ్రామిగారు దేవదయావ్యాప్తి గమనుబాపత్రికల తెలిపిరి. "మీరేమను నాటకశాక్రాచ్యము మీరుప్రొద్దుననుండి సాయంత్రంవరకు మీఅరపలాఅపూర్తికొరకు మేచేయార కచ్చేరిలోవచ్చినాతో చేరుగాకలవవచ్చును మీకుండుకష్టాలనుతొలగించుట నావిధి మీరు అధికారులనువిశ్వసించండి,ప్రభుత్వమువారినుండిన్యాయముదొరకదనిమీరు ఎప్పుడున్నూ విచారపడకండి అన్నిమతములవారు వికమత్యంతోఉండండి ఏ.హెచ్.ఇ. ప్రభువుగారియెడభక్తికలిగిఉండండి

## హైదరాబాదులో ప్రభుత్వ నూతనభవన నిర్మాణము

---

ఈ క్రింద హైదరాబాదు సమాచారమందు ఈవార్తయున్నది -

హి.ఇ.హె. నిజాం ప్రభువరేణ్యులు కేంద్రప్రభుత్వములు కార్యస్థానభవనముల ప్రకాశకము ఆగస్టు ౨౬-వ తేదిన ప్రారంభించుచు కొన్నిఅయా ఒభవనమునకు శంకుస్థాపనముచేసిరి-పెంక్రంజా హిలోద్దు పడమటిదిక్కున్న ౫౦ ఎకరములభూమి పై యీభవనములునిర్మింపబడును-ఈభూమినిగాలఅక్షరూపాయాలు పెట్టి కొనబడెను- హైదరాబాదు బి-జి-స్టేషనుకు ఇదిరెండుఫర్లాంగులలోనున్నది-అందుచే ఇదిఒకకేంద్రస్థలము వ్యాకమించిడగలదనిచెప్పవచ్చును శ్రీప్రభువరేణ్యులు మాత్రో శ్రీ మరణించుటకాలమిదికమునుండుటచే శంకుస్థాపనము నిరాడంబరముగజరిగెను రాజకుటుంబమువారును ఎగ్జిక్యూటివుకౌన్సిలు అధ్యక్షులును సభ్యులును ప్రభుత్వకార్యదర్శులునుమాత్రమే ఇందువచ్చిరి- హి.ఇ.హె. ప్రభువరేణ్యులీపనులయందు అత్యంతశ్రద్ధనుచూపి ఛీఫ్ ఇంజనీరు గారితో చాలసేపటివరకుభవనముల డిజైనులనుగురించియు, అందలిఅవకాశసౌకర్యములనుగురించియు ఇతరసౌకర్యములనుగూర్చియు చాలసేపటివరకుసంభాషించిరి

## అమెరీగారి అసత్యములు

రాజేంద్రప్రసాదుగారి అభిప్రాయము

హిందూ దేశపు కోటానుకోట్ల జనులందరికిని ఓటుహక్కు నిచ్చి ముసల్మానులప్రతినిధులను ముసల్మానులే ఎన్నుకొనునట్లుచేసి, ఈపద్ధతిగా ఏర్పాటుచేయు ప్రజాప్రతినిధిపరిషత్తు భారతదేశమునకు భావిరాజ్యాంగమును నిర్ణయించినట్లుచేయవలెననిగదా కాంగ్రెసుకోరుచున్నది, దానికి అమెరీగారు కొన్ని ఆక్షేపణలు తెలిపినారు. ఆయాక్షేపణలను విమర్శించుచు బాబూరాజేంద్ర ప్రసాదుగారు ఇట్లు చెప్పినారు.-

"ముసల్మానులకు ఇష్టముకాని ఏనిర్ణయమైనను వారలకుబలత్కారముగ అంటగట్టబడదని చెప్పినతర్వాతకూడ ముసల్మానులు ఏమిఆక్షేపణలు చేయగలరో తెలుసుకొనజాలకున్నాను- అధికసంఖ్యాకప్రజలుగల తెగలప్రతినిధులు తమనుఅడుగులో త్రొక్కిరదను భయములేకుండ ఆహ్వానము సంపూర్ణరక్షణ పొందుచున్నవి.-

"ప్రజాప్రతినిధి పరిషత్తునందు ఎక్కువమంది యొక్క-మాటప్రకారము నిర్ణయించుటకు అమెరీగారు ఒప్పుకొనకుండుటచూడగా ఆపరిషత్తునందు కాంగ్రెసువర్గపువారలే ఎక్కువమందిఉండబోయెదరని వారు గ్రహించినట్లే కనుపించును. పైన చెప్పినట్లు కట్టుదిట్టములేర్పరచి అల్పసంఖ్యాకుల అనుమానమును తొలగజేసినతర్వాత అధికసంఖ్యాకులనిర్ణయము చెల్లుటను అమెరీగారికేమియాక్షేపణయుండవలెను? అధికసంఖ్యాకుల వాంఛల ప్రకారము జరుపవలెనని, అల్పసంఖ్యాకులు పాలన చేయవలెననిగాని, రాజ్యాంగమును నిర్ణయించవలెననిగాని సూచించుచున్నారో? అల్పసంఖ్యాకులు పరిపాలనచేయవలెనని అమెరీగారుచెప్పుట ఆశ్చర్యమున్నదికానికాదు, ఇంతకును బ్రిటిషుపరిపాలన ప్రజల అభీష్టములప్రకారము జరుగునట్లు వ్యవస్థచేయబడలేదు- అమెరీగారికివచ్చిన నిజమయినచిక్కేమనగా, ఓటుహక్కుగల ప్రజలనిర్ణయము ను గురించి వారికిభయముగా నేయున్నది, కాంగ్రెసుఅట్టిప్రజలవిశ్వాసమునుపొందియున్నది అందువల్ల అమెరీగారు ఏవోలేనిపోనికారణములు చూపి హీనమైనకారణమును శ్రేష్ఠమయినదానినిగ జూపదలచినారు.

ఈదేశమునందు పరిపాలకులుగనున్న బ్రిటిషు ప్రభుత్వమును తొలగించి ఆచోటును ఆక్రమించుటకై కాంగ్రెసుఉద్యమించుచున్నదని అమెరీగారనినారు. కాని బ్రిటిషుపరిపాలన ప్రజలసమ్మతిపైఆధారపడలేదనియు, కాంగ్రెసు రాజ్యాధిపత్యమునకువచ్చినచో, ప్రజలుసమ్మతించుటవల్లనే అట్లుజరుగునవియు వారుమరచినారు- బ్రిటిషు పాలనను నిలుపుటకు బ్రిటిషువారిశక్తి సాధనము కాంగ్రెసుపరిపాలనను (పరిపాలనయని అనవచ్చునుచో) నిలుపుటకు భారతదేశప్రజలసమ్మతియు, అభీష్టమును సాధనములుగనుండును-

కాంగ్రెసుయొక్క అహింసకు అర్థమేమైనను సచో అదియిదియేగాని మరొకటి గాదు. బ్రిటిషువారిచేత భారతదేశమందు ఏపరిపాలనగాని ఉండగలదని అమెరీగారు ఊహించజాలకున్నారు. కాంగ్రెసుయొక్క అభిప్రాయము పూర్ణముగాదీనికిభిన్నము. దానిలో మొదట బ్రిటిషువారి అవసరముగనుక ఆదిపూర్తిగా తీసివేయబడును.

"భారతదేశములో అన్ని పక్షముల వారలును భారతరాజ్యాంగ శాసనమును నిరాకరించినందుకు అమెరీగారు విమర్శచేసి తెల్పినకారణము పూర్తిగా తప్పు-అదిఅందరిచేతను నిరాకరించబడినది-ఎందుకనగా, దానివల్ల-బీటికలు చిరస్థాయిగానుండునట్లున్నది- అట్లుచేయుటలో క్రియలక్ష్యమును దాటిపోయినది. మరియుఅనేకములైన అడ్డంకులను, ఆటంకములను పెట్టి నిజమైనఅధికారము బ్రిటిషువారిచేతులలోనుండునట్లు చేయునదిగా ఉన్నది.

"ఏతెగవారిలోగాని ఏమాత్రమైనను ఎక్కువమందిపై బలాత్కారముగ అంటగట్టబడిన రాజ్యాంగము సంతృప్తికరముగా పనిచేయజాలదు) అమెరీగారు చెప్పినమాటనేను పూర్తిగా ఒప్పుకొనుచున్నాను- అల్పసంఖ్యాకులచే అధికసంఖ్యాకులపై బలవంతముగా అంటకట్టబడినరాజ్యాంగము విజయవంతముగా అమలుజరుగుట అంతకంటె సాధ్యముకాదని అమెరీగారు గ్రహింతురుగాక యనిమాత్రమే నావాంఛ-భారతీయులను వారియిష్టమునకువదలినచో వారలు బ్రిటిషుపద్ధతినే అనుసరింతురనియు, తమపద్ధతిని తామేర్పాటు చేసికొనరనియు అమెరీగారెందుకు అనుకొనవలెను? మొదటిమాటభారతీయులు తమయిష్టమైనతీర్మానమును తాముచేసికొనుటకు స్వతంత్రులనుగా వదలవలెను. ఇదియేఅమెరీగారు సాగనీయరు. వారు భారతదేశమునకుఇచ్చెదనని చెప్పుదానిని అనుభవానికిరాకుండచేయుటకుఆటంకములను అనేకములను ఏర్పరచి నతర్వాతగాని వారట్లుసాగనిచ్చునట్లుకనిపించదు.

"......ప్రభుత్వస్థానమును కుర్చీలపైఅనేకులైయున్న వారలు క్రొత్తరంగుగలవారలు వచ్చినందువల్ల అమెరీగారు అధికారమునసనుభవించునిషయమున ఎట్టిభేదము గానికలుగలేదు. భారతీయులలో ఎట్టిఅభిప్రాయముగలవారు గాని ఈస్థితికి ప్రతికూలురైయున్నారు.

## అస్సాములో సావర్కారుగారి ప్రచారము

అస్సాంరాష్ట్రమునందు విద్రుముకతకు సావర్కారుగారు నవంబరు ౨౮ వతేదినపోయియుండినపుడు వారికిహిందూప్రజలును, అనేకహిందూసంస్థలును సన్మానమునుచేసియుండెను. ఆసన్మానములనందుకొని నవంబరు ౨౮ వతేదిన వారుపన్యసించుచు కాంగ్రెసు పక్షాలో బాధితులైన మానవులకై ఒక్కకన్నీటిబొట్టు రాల్చలేదుగాని ముసోలిని, హిట్లరులు పరదేశాక్రమణ చేసినందుకు దూషించినదని ఆక్షేపించిరి. ఈవిధముగహిందువులకు వ్యతిరేకమైనవిధానమును కాంగ్రెసుఅనుసరించుచుండ ఇకఊరకుండజాలమనిరి. హిందూమహాసభసమాధానపద్ధతికి సిద్ధముకొనుచుపట్టుచున్న మొండిపట్టు కొఅపరిమితముగనున్నదని జిన్నాగారు మదరాసులోఉపన్యసించినపుడు చెప్పినమాటకంటె హిందూమహాసభ ప్రశంసమరొకటియుండజాలదనిరి. తుదకునారు హిందువులందరును సంఘటనచెందవలెననిరి.

## భాషకలాపాలు— మద్రాసులో

ఆంధ్రనాటక కళాపరిషత్తు ౧.వ సమావేశము ఆర్ట్సుకాంపిక్షలో నూతనముగ నిర్మింపబడిన సెంటామేరీస్ హాలులోజరుగుతుంది. డిసెంబరు ౨౧ మొదలు ౨౪ వరకు నాటకప్రదర్శనాలు, ౨౫ మొదలు ౨౭వరకు మహాసభలుభరతనాట్యదివ్యత్యగీత ప్రదర్శనములు జరుగుతాయి.

మహాసభల సందర్భమున సుప్రసిద్ధవేషధారణానిపుణులు, వినోదనటకులును అయినట్లయితే, వి. చంద్రశేఖరంగారి ఆధ్వర్యాన Make up Artists యొక్క సమావేశంకూడా జరుగుతుంది. "వేషధారణము, రంగోపకరణములు" కుసంబంధించిన వివిధసమస్యలనుగురించి చర్చలు జరుగుతాయి. ఈసమావేశములో పాల్గొనగోరువారు డిసెంబరు ౧౪వ తేదీలోపుగా, కార్యదర్శికి [౧/౧౦, నల్లన్న మొదలి వీధి, రాయపేట] తెలుపగోరదము.

ప్రాచీనాంధ్ర కళావైభవాన్ని చాటేభామకలాపము, గొల్లకలాపము, అదిగాగల భరతనాట్యాలుకూడా జరుగుతాయి-. ఈ తెలుగుదేశపు భరతనాట్యపు కళాఖండాలలోని రసవత్తరఘట్టాలను ప్రదర్శించడానికి కూడాయిదే మొదటిసారి. దీనికితోడు శ్రీమతి రుక్మిణీదేవి-కాళంఅమ్మింగార్లు ఆధునికభరతనాట్యాన్ని కూడా ప్రదర్శిస్తారు.

## గోలకొండగ్రంథాలయము

నవకథామంజరి

(గ్రంథకర్త శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురం. ఉపోద్ఘాతము ౩౭ పుటలతో కలసి ౧౫౦ పుటలు వెల రూ ౧ గ్రంథకర్తగారివద్ద దొరకును.

ఇందు శునశ్శేఫుడు, రుద్రమ, అపస్తంబుడు వరరుచి, కుమారిలుడు, త్యాగరాజు, చంద్రవతి చరిత్రలును ఒకటురెండు—యోగికథనమును, ప్రాచీనాంధ్రవర్తకునికథయు వ్రాయబడినవి. రుద్రమదేవికథను శ్రీ మాడపాటి హనుమంతరావుగారు వ్రాసినారు. దానినే శ్రీ పంచ వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమకథంలో చేర్చి వారుని తెలుపుతూ చేర్చినారు. వీరువిపులముగువీనిని వ్రాసినారు. ఆదిపరిశోధనతోను అనేక నూతనవిషయములతోను కూడినట్టిది, శ్రీ శాస్త్రిగారికాంధ్రాభిమానముకుందము. అందుచేతనే వీరువిశ్వామిత్రసంతతియు అపస్తంబుడు ఆంధ్రులనియు ఆంధ్రులమూలపురుషులనియు బాగానిరూపించినారు. ఆంధ్రాభిమానముచేతనే త్రిలింగదేశ మహారాణికథకూడ తమయీసంపుటిలో చేర్చినారు. వరరుచికథ కథాసరిత్సాగరము పొందుపరచబడెను. ఆకథయే దీనికిమూలముగా కనబడుచున్నది. కుమారిలభట్టు ఆంధ్రుడని ప్రతిపక్షులను జైనులే వ్రాసినారు—ఆనిదర్శనాలిందు బాగా చూపినారు. తెనుగువాటి తురుష్క—యోగికథ మనోజ్ఞముగానున్నది— ఇట్టిహిందూముస్లింఐక్యతను తెల్పగాథలిప్పుడరుదైపోయినది. తుదిమూడుకథలు ఆంధ్రులకు ఆంధ్రదేశానికిసంబంధించినవి. కడపటిదగు శ్రీశైలకథలసంబంధములు శ్రీశైలములోనే టికిని పాడుపడినచంద్రగుప్తునిమేడయని శైలికులు చూపుదురట. ఇదొకనిదర్శనము— ఈకథలన్నియు ఆనందదాయకములే కాక విజ్ఞానప్రదములును వాఙ్మయములో మంచిస్థానమును సంపాదించుకొనదగినియును నైయున్నవి.

---

### యాదేరప్పగారు

మహారాజా సర్ కిషన్ ప్రసాదుగారి ఎస్టేటులో బహుకాలము అతిదక్షతతో మేనేజరు ఉద్యోగమును, నిర్వహించిన శ్రీగుండేరావుగారి పుత్రులైన వెంకటరావు అనుయువకుడు కటాలున కొన్నిమాసాలక్రింద చనిపోయిరంద్రిగారిని వృద్ధాప్యములో తీరనిదుఃఖములోముంచిపోయెను— అట్టియువకునిజీవితచరిత్ర అతనిపటముతోసహా ఉర్దూలో బాబూరావు కాకీకర్ గారిచ్చేవ్రాయించి ముద్రించినారు— ప్రియపుత్రునిగుణాలు ఇందువ్యక్తీకరించినారు— అవివినినతర్వాత అట్టిసుగుణుడుచనిపోవుట మరింతవిషాదముమనకలిగించకమానదు— ఆతనిజ్ఞాపకార్థము శ్రీగుండేరావుగారు కర్ణాటకపాఠశాలకు ౨౦౦౦ రూ॥ విలువగలయిల్లును మరియు యితరసంస్థలకు సుమారు ౩౦౦౦ రూపాయిలను దానముచేసిరి— ఈవిధముగానైనను ఈబాలుడు ఈలోకములో చిరంజీవియైయుండగలడని గట్టిగాచెప్పవచ్చును.

---

### సూర్యప్రభ

ఇదియొకమాసపత్రిక ౭౨ పుటలు. క్రౌన్ సైజు మేనేజింగుఎడిటరు డాక్టరు డి—అప్పారావు యల్—ఐ—యం—గారు సంవత్సరచందా రు—౧—౮—౦ దొరకుచోటు—౫౩ గోవిందప్పనాయకన్ వీధి, మద్రాసు—

ఈపత్రికయొక్క— ౧౯౪౧ పంబరు (రావ సంచిక) మంచిమాకార్యాలయము నలంకరించినది— ముద్రణాదికములు అందముగానున్నవి—ఇందుమంచికథలుగలవు—వైద్యజ్యోతిషవిషయములను గూర్చికూడ ప్రాధాన్యమీయబడినది— ఈసంచికలో భుజంగాయనమునుగూర్చి మంచివివరముకలదు— ముందుముందు "సూర్యనమస్కారము"లనుగూర్చి వ్యాసపరంపరలు ప్రకటించెదరట—ఇందుకొన్ని బొమ్మలుకలవు— అవియున్నియు సినిమాతారలవే— పత్రికఆకర్షణీయముగానున్నది.

---

### మాతృవాణి

ఇదియునొకమాసపత్రిక ౩౭ పుటలు క్రౌన్ సైజు—సంపాదకుడు డాక్టరు కేశరాజు వెంకటప్పార్థచంద్రిరావుగారు సంవత్సరచందా రూ౧—౦—౦ దొరకుచోటు "మేనేజరు మాతృవాణి, బెజవాడ"

ఈపత్రికయొక్క— ౧వసంపుటము ౫వసంచిక మాకుచేరినది— "అతడు" అను పద్యపంచకము "అహంకారపూజ"అను పద్యపంచకము ఇష్టే "వాస్తికా""ఖండితత"అనుపద్యములు "చాకలిరేవు"అనుకథ. చలనచిత్రముల పరీక్షలు, వినిమావార్తలు, "ఉవిదావనము"అను శీర్షికక్రింద స్త్రీలసమస్యలచర్చ ఈసంచిక నలంకరించియున్నవి.

---

## ఆంధ్రవాఙ్మయ సేవాసమితి

(పాల్వంచ సంస్థానము)

---

విక్రమ వృషసంవత్సరాల్లోని కృషివిశేషాలు

---

ఈశ్వర—ఉగాదినాడు ఖమ్మంపాండులోని వాఙ్మయాభిలాషులు కొందరు శ్రీ కా. శెం. రా. ల. నా. శర్మ కార్యదర్శిగారి ప్రోద్బలంతో సాహిత్యారాధనలు సాగించడానికై ఈసమితి కారంభోత్సవంచేసుకున్నారు. కావ్యకుసుమాలను సమర్పిస్తూ కవితాసమ్మానాలను గావిస్తూ బహుధాన్య సంవత్సరంలో బహువిధపోషకాభిమానవివిధ బృందాన్ని సమకూర్చుకొని నానావిధరచనము లంగీకరించి, 'కిన్నెర' అనుపేరుగల సాహితీసంపుటితో సహృదయ హృదయపరిమోదకరంగా ప్రమాది—ఉగాదినాటికి వాఙ్మయమహారిన లంకరింప జేశాం.

కార్యదర్శులైన శ్రీ శర్మగారు సాహిత్యప్రపంచములో సర్వజనామోదాన్ని సంపాదించి సభ్యుల రసమద్రచనలకు పురిగొల్పుతూ ప్రమాదివత్సరకృషిఫలితంగా 'ప్రమోది' అనుపేరున మరొకసంపుటిని ప్రకటించాలని నిర్ణయించుకున్నంతలో ప్రారంభావస్థలోనే 'కార్యస్థానపురూర్పు' 'వ్యవస్థాపక—హోదా' మొదలగువాని విషయాలలో వాదప్రతివాదములను శేటీసిప్రమాదాలకులోనై చందాలు, విరాళాలు, ఇవ్వక, నిరుత్సాహపరిస్థితులేర్పరిచినందున, "ప్రమోది" ప్రచురణకంతరాయాలుకలిగినవి. పాల్వంచలోఉంటూన్న శ్రీ శర్మగారుమాత్రము ౫౦—కిన్నెర సంపుటాలను విక్రయించి కొంతవరకు కార్యక్రమాన్ని నడుపుతూ వచ్చారు పిమ్మట కార్యనిర్వాహకులు కొందరు కృషించి ప్రయత్నించడంవల్ల విక్రమచైత్రంలో వేలూరి శివరామశాస్త్రిగారి అధ్యక్షతను సర్వసభ్యవార్షిక సమావేశంజరిగింది. శ్రీ శాస్త్రిగారు భాషోత్పత్తి వాఙ్మయవికాసము, కావ్యము—రసము ఇత్యాదివిషయాలను గురించిసమగ్రంగా ప్రసంగించారు. కొన్నికావ్యాలనుకూడ వినిపించి సభ్యులనానందింపచేశారు. వారి సమక్షంలోనే సర్వసభ్యసమావేశంజరిగి వివాదగ్రస్త విషయాలు పరిష్కరింపబడి శ్రీ శర్మగారికి కార్యదర్శకత్వంతోనే కార్యకలాపం కొనసాగించే నిర్ణయాలుచేయబడినవి. ఈసమయంలో విచ్చేసినమహారాజసంస్కృతకళాశాలాధ్యక్షులగు శ్రీ మామిడి వరదాచార్యులు ఎం. ఎ. గారుకూడ శిష్యసభ్యాభ్యాసంచేత పాల్వంచకుదయచేసి సమితిసభ్యులకోరికపై కార్యవిధానాన్ని విలోకించికవోత్పత్తి మోక్షమార్గము అనువిషయంమీద గంభీరప్రసంగంచేశారు, మరియు శ్రీశివరామశాస్త్రి శ్రీవరదాచార్య పండితోత్తములు కావ్యగోష్ఠిశాస్త్రచర్చజరిపి అపూర్వానందకలిగించారు. బ్రహ్మశతావధాని రామలింగశాస్త్రిగారుకూడ తమఖండకావ్యాలతో సభ్యులనాదరింపజేశారు.

పదునైదుసంవత్సరాలనుంచి ఈ అరణ్యప్రాంతములో విద్యావైశాలిత్వాన్ని వహించిచేస్తున్నకృషినిగమనించి శ్రీ భారతీతీర్థ విజయనగరం వారు సాహిత్యసమ్రాట్ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులంగారి అధిపత్యంతో శ్రీ శర్మగారికి సాహిత్యవిశారద బిరుదొసంగినందులకు కవులు, పండితులు, సభ్యులు తమఆనందాన్ని వెల్లడించి పోత్సాహమిచ్చారు.

మరల శర్మగారు సాహిత్యప్రియులైన నూతనసభ్యుల సంపాదించి రసమద్రచనల కేర్పాటుచేసి ప్రమోదిని పరికల్పించాలని ప్రయత్నిస్తూండగా ఆశ్వయుజాదారచనలను చూచియుంటామని తీసికొని ఎన్నిమార్లు బాలులవాళ్లీవిధను సంపుటిప్రచురణను సాగనివ్వలేదు.

విక్రమలో సమితి పక్షాన బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి సప్తతిజన్మదినోత్సవానికి అభినందన పద్యాలంపాం. ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులైన శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి షష్టిపూర్తి మహోత్సవానికి అభివందన పద్యాలు పంపాము

ఇటీవల సమితికార్యనిర్వాహకులలో ప్రముఖులును, కవులును, ఉదారస్వభావులును అయిన శ్రీ కొండపల్లి గోపాలరావు దేశముఖ్ దేశపాండ్యాగారు కవిశేఖరులైన శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారికి నూటపదహార్ల బహూకృతిని శ్రీ ఉభయభాషాప్రవీణ విశ్వనాధ వెంకటేశ్వరకవిగారికి అర్థశతరూప్యములను సమర్పించి కవితాదరాన్ని వెల్లడించారు. వీరుమొక్క గ్రంథాలురచించి ప్రకటింప నున్నారు, ఇట్టివారు మాసమితిలోనుండుట యెంతయు గర్విష్ఠులము.

ఈసమితికేవలం సాహిత్యప్రపంచయం కవితావైదుష్యంతో సంబంధంపెట్టుకున్నది. కాబట్టి వాఙ్మయసేవకులంతా సభ్యులుగచేరి సాహిత్యకుటుంబంగావుండి అన్యోన్యసామరస్యంతో పాటుపడుతూ ఔదార్యవంతులగు ప్రభువులయొక్క—యు, ఆంధ్రమహాశయులయొక్క—యు సాహిత్యసంపత్తితో 'ప్రమోది' సంపుటిని, కాలక్రమానసభ్యుల గ్రంథాలనూ, ప్రకటించాలని ఆశిస్తున్నాము.

కార్యస్థానం
పాల్వంచ
వృష మార్గశిరం.

ఇట్లు,
బెల్లంకొండచంద్రమౌళి శాస్త్రి,
సహాయకార్యదర్శి.

---



### నల్లజెండాల సన్మానము

సెప్టెంబరు౨౯వతేదిన అఖిలభారత ఫాసిస్టు ప్రతికూల కార్మికసంఘమహాసభకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడియుండిన యం_యన్ రాయ్ గారిని లాహోరుస్టేషనునుండి ఊరేగింపుతోగొనిపోవుటకుద్యమించినపుడు రాయ్ గారికి వ్యతిరేకులైనసుమారు ౨౦౦మందియువకులు నల్లజెండాలనుపట్టుకొని రాయ్ గారికి అపకారముచేయవచ్చిరి. రాయ్ గారి అభిమానులు కొందరుఆ జెండాలను వారలహస్తములనుండి గుంజుకొనబోగా కొంతఘర్షణజరిగి కొద్దిమందికిచిన్న గాయములయ్యెను— ఇంతలోపోలీసువారలువచ్చి అల్లరితీర్చిరి— తర్వాతఊరేగింపువెంట పోలీసువారు కాపలాగానుండిరి—

# Golkonda Patrika

Volu 16 — No 60 | *Published on every Monday and Thursday — Hyderabad Dn.* | 8—12—1941

## ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పట్టప్రదానోత్సవము

### నవాబు మెహిదీయార్జంగు బహద్దరుగారి స్నాతకోపన్యాసము

ఈసారి ఆంధ్రవిశ్వకళాపరిషత్తుయొక్క పట్టప్రదానోత్సవమునకు మ-మ-శ్రీ నిజాం ప్రభుత్వపు విద్యాశాఖమంత్రియు, ఉస్మానియా విద్యాపీఠపు ఉపాధ్యక్షుడునునగు నవాబ్ మెహిదియార్జంగు బహద్దరుగారు స్నాతకోపదేశము చేసిరి- వారి ఉపన్యాసమునందలి ముఖ్యవిషయము ఈదిగువ ప్రకటించబడినవి:

ఆంధ్రవిశ్వకళాపరిషత్తుయొక్క ఉద్దేశ్యముల సాధనకై హైదరాబాదురాజ్యమొక చిన్నవిరాళము నొసగినది- ఈధనమును ఖర్చుచేయువిషయమై ఈ విశ్వకళాపరిషదుపాధ్యక్షులవారితో చర్చించుటకై నన్ను వాల్తేరుకుపంపియుండిరి- తర్వాత డాక్టరు రెడ్డిగారు హైదరాబాదుకువచ్చి ఉస్మానియా విద్యాపీఠములో స్నాతకోపన్యాసమును గావించిరి. వారంతకుపూర్వమే హైదరాబాదులోని కొందరితో పరిచయము కలిగియుండిరి, కాని నాటినుండి ఈరెండువిద్యాపీఠముల మైత్రిబలపడజొచ్చినది. ఇందుకొక ఉదాహరణము, ఆంధ్రశిల్పముగురించి డాక్టరు గంగూలీగారు వ్రాసిన గ్రంథమును హైదరాబాదులో అచ్చువేయించుచున్నాము దానిని రెండు విద్యాపీఠములును కలిసి ప్రకటించును.

#### నిజాంరాష్ట్రి చారిత్రిక ఘనత

మ-మ-వ నిజాంరాష్ట్రమునందు నేనుంటునది హైదరాబాదునగరము-ఇదియుండు తెలంగాణా భాగమందు ఆంధ్రులు అభివృద్ధిచూపగల చారిత్రకవిశేషములున్నవి. ఆంధ్రులు ప్రాచీనజాతివారు కాని వారలప్రాచీనమగుచరిత్రను వ్రాసియున్న పుస్తకములులేవు. ఆవిషయములో మనకిప్పుడు తెలిసినదంతయు ప్రాచీనశాసనపురేకులనుబట్టి, భూగర్భస్థితులనుబట్టియు, ఈదేశానికి అప్పుడప్పుడువచ్చిపోయియుండిన విదేశీయులు వ్రాసికొనియున్న విశేషములనుబట్టియు తెలిసినవిషయములైయున్నవి. కాని మ-మ-వ నిజాంరాష్ట్రములో భూగర్భస్థితులు ప్రాచీనచరిత్రను తెల్పగలవి కుప్పతెప్పలుగానున్నవి. ఈరాజ్యమందు అటను శిలాయుగానికిచెందిన పెండుకత్తులవంటి శిథిలములుకూడనున్నవి- చరిత్రకందు కాలానికంటె పూర్వకాలపుదియగు సమాధులమున్నగునవి హైదరాబాదునగరానికి కొద్దిమైళ్ళ దూరములోనుండు మౌలాఅలీవద్దను, దోర్నకల్లు, హనుమకొండ వద్దను కనపడినవి. రాయచూరుజిల్లాలో మాస్కివద్దను దానిసమీపమందును కనపడిన పూర్వులలో గొప్పమహారాజదారికవద్ద చిక్కినవాటి తోలియున్నవి. ఇటీవల నేహైదరాబాదునకు 70 మైళ్ళదూరమున కొండాపురమువద్ద చాలప్రాచీనమైనయొక ఆంధ్రనగరముయొక్క శిథిలములు కనబడినవి- అక్కడ శాతవాహనచక్రవర్తులనాటి ప్రాచీనకాలపు నాణెములు, సొమ్ములు, కుండపెంకులును కనపడినవి- ఒక సంవత్సరముక్రింద తెలుగులో ౧౦౦౦ సంవత్సరాల క్రిందటియాకులగ్రంథములను ఉస్మానియా విద్యాపీఠమువారు సంపాదించినారు.

చరిత్రకందుకాలములో వరంగల్లువిద్యాసాధనకు తెలుగుకవిపోషకనియున్న ఆంధ్రనగరిగా యుండినది. రాజవీధికెక్కిదానికుండిన కవాటము బంగారువని చెప్పబడినది. ఆవీధిన అశ్వ, గజ పదాతిసేనలు పోవుచుండెడివట- ఆనగరమునందు ఒకచోట ఆంధ్రులకళాభిమానమునకు నిదర్శనములుగ కొన్నికళావస్తువులుండుచుండెను. ఈవరంగల్లు సమీపమునకే తెలుగుమహాభాగవత రచన జరిగియుండెను.

#### ఉస్మానియా విద్యాపీఠము

కనుక హైదరాబాదురాజ్యముతో ఆంధ్రుల చారిత్రకసంబంధము, ఆర్థికసంబంధము అవిచ్ఛేద్యమైనది. నిజాంరాష్ట్రమునందు తెలుగు ఒక ప్రాంతపుభాష-దానిని చదువుటకు ఉస్మానియా విద్యాపీఠమందు అన్నిటికంటె పెద్దతరగతివరకు మానవ ఏర్పాటు చేయబడియున్నది- ఈభాషను అదేభాషలో సంశోధచేయుచున్నారు, ఇట్లే తక్కినభాషలకును గలదు- ఉస్మానియా విద్యాపీఠమునకు తెలుగులెక్చరరుగా [illegible] రావుగారు గొప్పపండితులును కవియునైయున్నారు.

తెలుగుభాష మాట్లాడుచోటపెల్ల [illegible] ప్రసిద్ధమైయున్నది. తెలుగులోను, ఇతరములగు స్థానికశాఖలలోను ఇదివరకు కనుగొనియుండని విషయాలనుకనుగొనుటకై పరిశోధనలనుచేయుటకు సౌకర్యములను మావిద్యాపీఠ మేర్పాటు చేయుచున్నది-అట్టిపరిశోధనలనుచేయువారికై స్కాలర్షిప్పులు ఏర్పాటుచేయబడినవి.

#### ప్రాచీనగోలకొండరాజుల కాలము

గోలకొండను ఖుతుబ్‌షాహి రాజులు గొప్ప తెలుగుపండితపోషకులు-అద్దంకిగంగాధరకవి ఇబ్రహీంఖుతుబ్‌షారాజుయొక్క పోషణపొందినవారి ప్రతాపమునువర్ణించు ఒక కావ్యమురచించెను, అది ఇపుడున్నది-ఇబ్రహీంరాజ్యానికివచ్చుటకు హిందువులసహాయమే చాలవరకుకారణము-అతను ప్రజానురాగముపొందినరాజు. హిందువులాతనిని మాల్కిభరాము అనుచుండెడివారు. అతనుపట్టంకొరకువద్దనియోగించిన అమీర్‌ఖాన్‌గూడ తెలుగుసారస్వతమునకు ప్రోత్సాహమిచ్చియుండెను-అతనిభార్యఆజిల్లాలో దరిద్రులకుదానములిచ్చి ప్రసిద్ధిగాంచినది.

ఖుతుబ్‌షాహిసేనలలో హిందువులుముసల్మానులు ప్రభుభక్తియందు అహంసకామికతోనుండెడివారు-ఆరాజ్యమందుఆంధ్రులు గొప్ప అధికారములందుండిరి. కడపటిఖుతుబ్‌షాహిరాజుకాలమందు యెంకన్న మాదన్న లనుమంత్రులే సర్వాధికారులైయుండిరి. వీరలరాజ్యమందు పార్సీకితమ వాలె తెలుగుకే గౌరవముండెను.

ఖుతుబ్‌షాహిరాజులు అన్నిమతముల వారిని సమదృష్టితో జూచుచుండిరి. మధ్యబ్రాహ్మణ సన్యాసులకు ప్రత్యేకాభిమానముతో అనేకభూదానములుచేయబడినవి-దక్కన్ ముసల్మానరాజులను, మొగలాయిచక్రవర్తులును దేవాలయముల పోషణకొరకుభూములను ఈనాముగానిచ్చిరి. వాటిలో అనేకములిప్పటికిని అనుభవముతోనున్నవి ఇందుభద్రాచలదేవాలయమొకఉదాహరణము

హిందూముసల్మానులనాగరికతల సమ్మేళనముచే భారతదేశమునకులాభించిన విశేషములలో ముసల్మానులకళాభిమానమునుపరించిరి నిర్మాణములు ఒకభాగము వారుకట్టించిన రమ్యనిర్మాణములలో కొన్ని ఇప్పటికిని హైదరాబాదు, ఔరంగాబాదు, బిదరుమన్న గుర్తులములలోనున్నవి. దీనినిర్మాణపద్ధతికిని ఉత్తరమున నిర్మాణములపద్ధతికినిగలభేదము గమనించినచో ఇక్కడ పార్సీ హిందూపద్ధతులసమ్మేళనము కనిపించును. ఆంధ్రప్రాంతమందు హంపీవిజయనగరమందలి పౌరులభవనములలో ఇస్లామీపద్ధతికనపడుచున్నది- ఇట్టుభారతీయనిర్మాణముది రెండుతెగల ప్రజల కళాభిరుచులయొక్కయు, సంస్కృతులయొక్క సమ్మేళనముయొక్క ఫలమైయున్నది.

ఉస్మానియావిద్యాపీఠము సాహసముతో ఉర్దూలో విద్యబోధించుపద్ధతినిస్వీకరించినది, ఎందుకనగా, ఆభాష ఇక్కడ ప్రభుత్వభాషయేగాక అందులో అనేక భిన్న భాషలపదములు చేరియున్నందువల్ల భారతదేశమందు అనేకప్రాంతముల వారలకుఅర్థమగుభాష. దానినిస్వీకరించినందువల్ల భారతదేశానికంతటికిని సాధారణభాషనొకదానిని సృష్టించుటలో మరొకఅడుగుముందుకు పోయినట్లయినది. హైదరాబాదుసంస్థానమందు మూడుభిన్నప్రాంతీయభాషలున్నవి కాబట్టి ప్రాంతీయభాషలలో విద్యాబోధచేయదలచినచో మూడుభాషలను మూడువిద్యాపీఠములను పెట్టవలసియుండును, ఇదిసాధ్యముకానిపని. మరియువాటిలో ఏదిగాని భారతదేశానికి సాధారణభాషగానుండదగదు అయినను ఆభాషలలో దేనిలోగాని ఉస్మానియావిద్యాపీఠపుఎం-ఏ పరీక్షకుపోవచ్చును

భారతీయభాషలో విద్యాపీఠవిద్య నేర్పుటవల్ల ఇతరవిషయములను నేర్చుకొనునపుడు భాషసంబంధమైనకష్టముతప్పును. కాబట్టి విషయము విదేశీయభాషలో బోధించినదానికంటె సులువుగా బోధపడును. అందువల్ల ఈపద్ధతిఇంకను వ్యాపించగలదు-కాబట్టి ఆంధ్రవిద్యాపీఠమువారు ఒకానొకరోజు తెలుగులో విద్య నేర్పుపద్ధతి నవలంబించినచో నే నాశ్చర్యపడను.

మనలో ఉత్తమమైనదానిని సకాలింపజేసి, మనను జీవయాత్రయందు మనవిధులకు అర్హతములమగునట్లు తయారుచేయుటయే విద్యయొక్క ప్రయోజనము. ఈనాటపరిస్థితులలో శిక్షణాశక్తులను తయారుచేయుటలో విద్యాపీఠవిద్య అన్నిటికంటె [illegible] ఉపయోగము [illegible] అనుటకు పరీక్షలు మొదలైనవి ఈసరిక్షకే గాక మనము చేయవలసినదికూడ ఉన్నది.

విధేయతవిజయమునకు ముఖ్యమైనది. [illegible] విద్యాపీఠవ్యవస్థ నిలువజాలదు ఇటీవలకొన్ని విద్యాపీఠములలో అవిధేయత ప్రవేశించుచున్నది.

పెద్దమనిషియని పేరుతెచ్చుకొనిన [illegible] క్షణములలో నొకటియేమనగా, ఇతరులభావములకు నొప్పికలిగించకుండ తప్పించుకొనుచుండును. విశ్వవిద్యాపీఠములిచ్చినశిక్షణము పొందిన యువకులకు సత్ప్రవర్తన ఉన్నదా లేదాయని నిర్ణయించుట ఈవిధముగా పరీక్షించవచ్చును- విద్యాపీఠవిద్యలో మతముకూడ చెప్పవలెను. మనవిద్యాపీఠములీఆదర్శములన్నిటిని సాధించవచ్చును- ఇట్టుగుణవంతులైన విద్యావంతులనుతయారుచేసినపుడు విద్యాపీఠముల కృషికి వేయింతలఫలితమిచ్చినట్లే

## బ్రిటిషు ప్రభుత్వపు ఖర్చు హెచ్చుట

(ప్రభుత్వ ప్రకటనశాఖనుండి)

ఆస్వాల్డుడచ్ అనువారు వ్రాసిన ఒకవ్యాసమం దిట్లున్నది:—

ఇపుడుజరుగుచున్న ఆర్థికసంవత్సరమందు మొదటి 6-నెలలలో ఒక్క-అదాయపుపన్నుమూలంగానే ౨౩౫౦౦౦౦౦ పౌనుల ఆదాయము లభించెను. అదేపూర్వసంవత్సరమందు ౧౫౫౦౦౦౦౦౦ మాత్రమే-అసలుఇప్పటిసంవత్సరపుపూర్తి లెక్క నవంబరువరకున్న లేదు-ఈనెల మొదలుకొని ప్రతివారముకూలిచెల్లించినతర్వాత దానినుండియు, నెలనెలకుజీతములిచ్చినతర్వాత వాటినుండియు ఆదాయపుపన్ను లెక్కకోసివేయబడును, మొత్తం మీదసంవత్సరానికి ౨౧౫౦౦౦౦౦౦ పౌనులు యీవిధముగా ఆదాయపుపన్నుద్వారావచ్చునని అంచనా వేయబడియుండెను, ఇపుడుఅంతకంటె ఎక్కువరావచ్చునని అనుకొనుచున్నారు.

అక్టోబరు ఆఖరువారములో మొత్తము ౧౨౫౦౦౦౦౦౦ పౌనులు ప్రభుత్వపుఖర్చు-ఇదివరలో ఇంతఎక్కువఖర్చు ౧౯౪౧-మార్చి కడపటి వారములో చేయుండెను, ఇందులోనుండి జాతీయఋణపుభాగ్జీలకై ౧౫౫౦౦౦౦౦ పౌనులనుతీసివేసినతర్వాతకూడ మొత్తముఖర్చు ౧౦౪౦౦౦౦౦౦ పౌనులుఅగును. అనగా రోజుకొక- ౧౫౦౦౦౦౦౦ పౌనులు అగును.

## ఆంధ్రరాష్ట్రసిద్ధికి విఘాతము

### శ్రీరాజగోపాలాచారిగారికి శ్రీప్రకాశం పంతులవారి సమాధానము

శ్రీమాన్ రాజగోపాలాచారిగారి ప్రకటనకు సమాధానముగా శ్రీప్రకాశంపంతులుగారు ఇట్లుప్రకటనచేసినారు:— శ్రీ సి రాజగోపాలాచారిగారు "హిందూ" పత్రికకు యిచ్చిన సమాధానమునేను చదివినాను. ఆసందర్భములో శ్రీఆచార్యులవారు ఇట్లుఅనినారు, "ఎర్‌స్కిన్ ప్రభువువద్ద పలుకుబడికలిగిన తోడిమంత్రులలో ఒకరు వారువివరించిన రహస్యవిధానము ప్రకారము ఆపలుకుబడిని వినియోగించినట్లు శ్రీప్రకాశంగారు ఏఆధారమునుబట్టి ఈనిందారోపణచేసినారో నాకైతే తెలియదు" నేను నిందారోపణ చేయలేదు. జరిగిన వ్యవహారసందర్భములను బట్టి ఇట్లుజరిగి వుండవలెను అనేపూహనుమాత్రము వెల్లడించినాను. దానికిముఖ్యాధారము ఏమనగా ఒకప్పుడు ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి అనుకూలుడయిన ఎర్‌స్కిన్ ప్రభువు కేవలం అనుకూలుడుగా వుండుటయే కాకుండ ఉభయరాష్ట్రములకును మద్రాసీముఖ్యపట్టణముగాకూడా ఉభయులకూ ఒకే గవర్నరుగానూ వ్యవహరించవచ్చునని సూచనకూడా చేసినట్టి ఎర్‌స్కిన్ ప్రభువు, ఇండియా కార్యదర్శికి తామువ్రాసిన ఉత్తరములలో ఆంధ్రరాష్ట్రానికి ప్రతికూలముగా అభిప్రాయముప్రకటించినారు. ఎవరిమాటలోవిని ఎర్‌స్కిన్ ప్రభువుతన అభిప్రాయము మార్చుకొని వుండవలెనని ఇదివరకు నమ్మినాను. ఇప్పుడునమ్ముచున్నాను-

అట్లు వారిమతముమార్పించినది తోడిమంత్రులలో ఒకరు కావచ్చును. ఇతరులెవరైనను కావచ్చును. శ్రీరాజగోపాలాచారిగారు తమప్రకటనలో సూచించినట్లుగా తోడిమంత్రులలో ఒకరైయుండవలెనన్న నిర్ధియేమీలేదు. ఆవ్యక్తి ఎవరుఅన్నవిషయమై నాకుఅనుమానముకూడా వున్నప్పటికి ఫలానా అనిమాత్రం నిర్ధారణచేసి చెప్పలేకపోయినవాడను. స్వతహా అనుమానమే రుజువుకాదు, అనుమానంమీద ఒకరిమీద నిందవేయుటం సరికాదు, అందుకనే, ఆవ్యక్తి ఎవరో బయటపెట్టండి అని ఆంధ్రమహాసభలోనున్న సభ్యులు బలవంతపెట్టినపుడు అది నాచేతకానిపని అంటిని. ఎందువల్లనగా నిర్దోషియైన పొరపాటున నేరముమోపుట న్యాయమ్మలేదు గనుక ఒకప్రధానమైనసమస్యమీద, నాకిప్పుడు తెలిసినంతవరకు ప్రజలయెదుట బయటపెట్టవలసివచ్చినది. అదినేనుకోరిచేసినపనికాదు. నన్ను సభవారు సమాధానముఅడుగగా చెప్పవలసివచ్చినది. ఆచెప్పుటలో పేరులేవియు బయటపెట్టకుండాచెప్పినాను. కాని శ్రీరాజగోపాలాచారిగారు ఎర్‌స్కిన్ ప్రభువుమనస్సు మార్చి ఆట్లా చేయించగలిగినది తాముమాత్రమేనని, ఇతరులెవ్వరునుకాదని అనుకున్నచో వారిమాటను కాదనుటకు నాకెట్టిఆధారమునులేదు.

ఒకందుకుమాత్రముసంతోషము. నేనుచెప్పిన విషయాలను వారుకాదనలేదు. నేనుఎవరిని గురించి నిందాగర్భితముగా మాటలాడితినని వారనుకున్నారో ఆవ్యక్తియెవరైయుండును అనువిషయమునుగురించిమాత్రమే వారు చర్చించిరి. ఆంధ్రరాష్ట్రసమస్యను ప్రతికూలురైనవారిలో నాకంటె నాయొక్క-నమ్మదిని సుముఖులుగా మార్చియుండిరని శ్రీరాజగోపాలాచారిగారు చెప్పినందులకు నాకృతజ్ఞతను"

## కాంగ్రెసు పెద్దనాయకుల విడుదల

ఇండియా ప్రభుత్వమువారు ఏదో నేరముమాత్రము శాసనోల్లంఘనము చేసినట్టి వారనదగిన ఖైదీలను వదలిపెట్టుటకు నిర్ణయించి రాష్ట్రప్రభుత్వాలకు తెలిపినారు. అందుపైసంయుక్త రాష్ట్రప్రభుత్వమువారు పండితజవాహర్లాలు గారిని కాంగ్రెసు అధ్యక్షుడగు మౌలానాఅబుల్‌కలాం ఆజాదుగారిని డిసెంబరు 4వ తేదిన విడుదలచేసినారు. జెయిలు గేట్లవద్ద వీరలకు అనేకప్రజలు స్వాగతమిచ్చి పూలమాలలువేసి సన్మానించినారు, ఈ విడుదలవల్ల కాంగ్రెసువారు యుద్ధములో ప్రభుత్వమువారికి తోడ్పడుటకై అభిప్రాయమును మార్చుకొందురని ప్రభుత్వమువారి ఆశయగునో అది వట్టిభ్రమయైనదియు, అదిత్వరలో తేలగలదనియు గాంధిమహాత్ముడు తలంచుచున్నారు.






Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.